

# పాఠకమహాశయులకు విజ్ఞప్తి



పాఠకులకు నమస్కారములు నేను గత తారణనామసం॥మునుండి వికృతి నామసంవత్సరము **2010,2011** వరకూ పంచాంగగణన చేసి తదుపరి కొన్ని కారణము లవలన పంచాంగమును రచించలేదు కొన్నిగ్రంథములను అనువదించితిని కొంతమంది స్నేహితుల ప్రోద్భలమువలన మరలా ప్లవనుండి పంచాంగమును విడుదలచేయు చున్నాను. ఈపంచాంగము ఆంధ్రప్రదేశ్ నడిబొడ్డున గల రాజమండ్రి పట్టణమునకుసరిచేసి వ్రాయుట జరిగినది. ఇందుతిథివార నక్షత్రము యోగ కరణములు సూర్యోదయ అస్తమయములు వర్జ్య దుర్ముహూర్తములు అమృత ఘడియలు ప్రవేశాంతములు గంటలు నిమిషములలో చూపబడినవి. దినప్రమాణము దిన భుక్తిని ఘడియవిఘడియలలో చూపడము జరిగినది శుభముహూర్తములు వీలయినంత ఎక్కువగా గుణా ధిక్యతలు గలగియున్నవి మాత్రమే వ్రాయుచున్నాను. ఈపంచాంగము చైత్రపక్ష అయనాంశ (భారతప్రభుత్వ సమ్మతమగు లాహిరి అయనాంశ) ల ననుసరించి గుణించి వ్రాయడ మైనది సనాతనము సమ్మతమగు ఈ పంచాంగము ననుసరించి విజ్ఞులు కర్మల నాచరించెదరనియూ గతమువలె ఈనాపంచాంగమునాదరించి ఆచరించెదరని విశ్వసించు చున్నాను. ముఖ్యగమనిక రాబోవుసం॥మునందున వైశాఖజేష్టముల యందున వరుసగా గురుశుక్రమౌఢ్యములు ఉన్నవి అందువలన ఉ పనయనాదులు ఈసం॥ వీలయినంతవరకూ చేయగలరు.

ఇతరరచనలు జాతకగణితప్రవేశిక. శంభుహెూరా ప్రకాశిక

బృహత్సంహిత 1,2,3, భాగములు

భవదీయుడు జ్యోతిషప్రపూర్ణ డా॥శిష్ట్లా ఉమామహేశ్వరశర్మ సిద్ధాంతి

శ్రీకాకుళం ఫోన్ నం॥ 9431757058, 9031836883

మా యూ ట్యూబ్ చానల్ jathaka nidhi వీక్షించి మరిన్ని నూతనవిషయములు తెలుసుకొనగలరు.



**పాఠకులకు ముఖ్యవిజ్ఞప్తి**

నేనుచాలా గ్రూపులలో సభ్యునిగాఉన్నాను అందులో చాలామంది మహాత్ములు జ్యోతిషశాస్త్రమును గణిత (పంచాంగగణితము) సంహితా గ్రంధములను ఆపోసన పట్టినవారు చాలామంది ఉన్నారు అలాటి గ్రూపులలో దృక్‌సిద్ధాంత (చైత్రపక్ష) పంచాంగములమీద కొన్నివ్యాఖ్యలు చేస్తున్నారు అవి ఏమిటంటే 1 దృక్‌పద్ధతి భారతీయ సాంప్రదాయముకాదు అని. **దీనికి నాకు తోచిన జవాబును వ్రాయు చున్నాను** నిజమే మేము దృక్ పంచాంగములను లాహిరి ఎఫమెరీస్ (సారిణి పధకము లేక కోష్టకము) ప్రకారము వ్రాయు చున్నాము ఎఫమెరీస్ సనాతనపద్ధతికాదు అని అంటున్నారు దీనికికారణం నాసావారి నుండికానీ కలకత్తా నక్షత్రశాలనుండి గానీ ఈ ఎఫమెరీస్ విడుదల అవటమే. వారుఆకాశములో గ్రహములనుక్షుణ్ణముగా పరిశీలించి వాటి గతి వేగమును తెలుసుకొని సాయన గ్రహములనుమాత్రము ఎఫమెరీస్ ద్వారా అందచేయుచున్నారు. ప్రస్తుతము మనదేశమున పూర్వపద్ధతిలో గ్రహములు దృక్ తుల్యములుకాకున్నవి ఎందులకనగా మిహిరాచార్యులు బృహత్సంహిత గ్రంధమున రెండవఅధ్యాయమున దైవజ్ఞలక్షణములను తెలుపుతూ. “ సిద్ధాంతభేదేప్యయన నివృ **త్తౌప్రత్యక్ష మండలంలేఖాసంప్రయోగాభ్యుదితాం శకానాంఛాయా జలయంత్ర దృగ్గణితసామ్యేనప్రతిపాదనకుశలః”** తా॥సిద్ధాంతగ్రంధములయందున పరస్పర భేధములుకలగినప్పటికినీ అయనాంశల మార్పు చెందుకాలమును ప్రత్యక్షముగా సమమండలరేఖలనాధారముగాచేసుకొని వాటి ఛాయలవలన జలఛాయాయంత్రము లద్వారా తెలుసుకొని దృగ్గణిత తుల్యముగా ప్రతిపాదించుకౌశలముకలవాడు దైవజ్ఞుడు అనితెలిపినారు **పరాశరులవారు** తనహోరాశాస్త్రమున 3వ అధ్యాయమున గ్రహగుణస్వరూపాధ్యాయమున **శ్లో:యస్మిన్‌కాలే యధాకేటా యాన్తిదృగ్గణితైక తామ్॥ తవేవస్ఫుటాకార్యా:దిక్పాలౌచ స్ఫుటౌవిదా॥** తా॥ అనగా ఏకాలమున సిద్ధాంతగ్రంధములననుసరించి సాధించబడినగ్రహములు దృక్ తుల్యములగుచున్నవో ఆయా సిద్ధాంత గ్రంధములననుసరించి గ్రహములను దిక్కాలమును సాధించవల యును అని తెలిపినారు ఇంకనూ సూర్యసిద్ధాంతము అటులనే చాలాగ్రంధముల యందున దృక్ తుల్యగ్రహములే స్వీకరించవలసియున్నదని తెలిపినారు అయితే గతములో **గణకానందము గ్రహలాఘవము మొదలగు కరణగ్రంధములు వెలుగులోకి ఆనాటి మహాపండితులు తెచ్చినారు అవి వాటికాలము నకు దృక్ తుల్యములే** వర్తమానమున (ప్రస్తుతము) ఆగ్రంధములతో దృక్‌గ్రహములు వచ్చుటలేదు అంతేకాదు తరువాల శ్రీకేత్కారుగారు దృక్ గణితార్ధమై కేతకీగ్రహగణిత మును అందించినారు ఆగ్రంధముతో సాధించినను దృక్ గ్రహములు చాలా వ్యతా సముగానున్నవి అటులనే జ్యోతిర్గణితము వర్తమానమున ఉన్నది కానీ దానితో గ్రహములు సాధించిననూ కొద్ది సెకన్లు వ్యత్యాసము వచ్చుచున్నది. అంటే కాలగమనముతో పాటు ఆయాకాలములకు నూతన కరణ గ్రంధములను ఆవిష్కరించుకొని సిద్ధాంతులు పంచాంగరచనను చేయవలెను. మనప్రారబ్ధము వలన ప్రస్తుతకాలమునకు కరణగ్రంధములు లేవు





పాతవైన కరణగ్రంధములతో దృక్ గ్రహములు రావుకనుక తప్పనిసరియై మేము ఎఫమెరీస్ ను వాడుచున్నాము ఇంకొకవిషయమేమనగా చైత్రపక్షమును వ్యతిరేకించు మహానుభావులే కుజాదిపంచగ్రహములను చైత్రపక్షమున స్వీకరించుచున్నారు అది ఎలాసాధ్యము?చైత్రపక్షమును విమర్శించువారు దయచేసి **కుజాది పంచగ్రహములను పూర్వపద్ధతిలో వ్రాయగలరా** ? వ్రాయలేరు అట్లైనచో మౌఢ్య గ్రహములఉదయా స్తమయములు (మౌఢ్యములు) పుష్కరాదులు సరిరావు. ఆకసమున కనిపించు కుజాది గ్రహములు తప్పుగా కనపడును కనుక వారుఆవిధముగా వ్రాయరు. రవిచంద్రులకు మాత్రమే దృక్ సంస్కారముచేయక తక్కినగ్రహములకు చేయుచున్నారు. అంటే కనపడని తిథ్యాదులవిషయములో తప్పైననూ కనపడదు కనుక పూర్వపద్ధతి అని తెలుపుతున్నారు దీనికి బాణవృద్ధి రసక్షయ: అనువాక్యమును ఉధహరరించు చున్నారు. ఆకాలమున తిథివృద్ధిక్షయములు 5ఘడియలు 9ఘడియలు ఉండెడివి కాలానుగుణంగా వాటిలో వచ్చేమార్పులను వీరు గ్రహించరు. **ఇక ఖచ్చితముగా గ్రహణములు సాధించవలెనన్నచో దృక్ లేక సాయన గ్రహములను వాడవలసినదే.** అలాటప్పుడు పూర్వపద్ధతివారు వ్యాఖ్యానం గ్రహణ తిథివేరు అనిఅంటారు కానీ నిజానికి తిథి అనేది రవిచంద్రుల మధ్యదూరమే కదా ఈవిషయము వారికికూడాతెలుసు **. ఈవిషయములో అందరినీ నేనుతప్పుపట్టటం లేదు కేవలం చైత్రపక్షమును విమర్శించినవారికి మాత్రమే ఈవిషయం తెలియజేయుచున్నాను.** పాశ్చాత్యపద్ధతి ఐన ఫోనులు వాడుతున్నారు టి వీ,లు చూస్తు న్నారు కంప్యూటర్ ఇలా అన్నింటికీ లేనిది ఒక్క ఎఫమెరీస్ తో ఖచ్చితమైన పంచాంగము లు తయారుచేస్తే మాత్రం అది ప్రాచీనభారతీయత పద్ధతికాదు అనడం సరియైనదికాదు అని మనవి చేసుకొనుచున్నాను మేముకూడా వీలయినంతత్వరలో భారతీయ సాంప్రదాయమైన గ్రంధములద్వారా చైత్రపక్ష పంచాంగము వ్రాయుపద్ధతి కోసం అహర్నిశలూ ఆలోచించి ఆప్రయత్నముపూర్వకముగా అడుగులు వేయుచున్నాము.

**2** ఇక మరొకపేరుమోసిన సిద్ధాంతిగారు తెలంగాణా నుండి నాతో మీదృక్ ఏ నగరానికైనా **తిథ్యాదులు ఒకేలాగ వస్తాయు** అని అన్నారు. వారివాదనఏమనగా ఘడియలు విఘడియలలో ఇచ్చేపూర్వపద్ధతి సమయాలు వేరుగా ఉంటాయి మీగంటల పంచాంగము లయందున అన్నిప్రాంతములకు తిథ్యాదులు ఒకేసమయములో ఉంటున్నాయి అనిఅన్నారు. దానికి మేము ఇచ్చే విశ్లేషన గమణించగలరు మేము ఇచ్చే సమయాలు సరి అయినవే ఎందులకనగా గంటలపంచాంగములో అన్ని ఐ ఎస్ టి ( ఇండియన్ స్టాండర్ టైమ్)నకు సూచిస్తాము కానీ అవి అన్నినగరాలకీ సరిపడతాయి భారతదేశమంతా సమయపాలన లో ఒకే టైం వాచీలన్నీ చూపిస్తాయి మాపంచాంగాలలో ఘడియ విఘడియలలో వ్యత్యాసం ఉంటుంది గంటలు నిమిషాలలో వ్యత్యాసం ఉ ఒడదు కారణం ఉదాహరణకి ఉదాహరణకు ఈ శోభకృత్ నామసం॥ ఉగాదికి ఉ దయం 8-00 గంటల సమయానికి ఒక ఐదు నగరాలకు తిథ్యాదులను మేము ఇచ్చే విధానముచూపిస్తున్నాము 1 రాజమండ్రి 2 హైదరాబాద్ 3 విశాఖపట్నం 4 కడప 5 విజయవాడ

| | రాజమండ్రి | హైదరాబాద్ | విశాఖపట్టణం | కడప | విజయవాడ |
|---|---|---|---|---|---|
| సూ ఉ | 6-09 | 6-22 | 6-03 | 6-21 | 6-14 |
| తిధిపాడ్యఘు॥వి॥ | 35-37 | 35-03 | 35-51 | 35-07 | 35-25 |
| తిధి గం॥ని॥ | రా॥8-24 | 08-24 | 08-24 | 08-24 | 08-24 |
| నక్ష ఉ॥బా | ఘు॥23-26 | 22-53 | 23-41 | 22-56 | 23-14 |
| నక్ష గం॥ని॥ | పగ 03-32 | ప॥3-32 | ప॥3-32 | ప॥3-32 | ప॥3-32 |

ముందురాజమండ్రి తిధి ఘడియలు 35-27 ను గంటలు నిమిషాలలోకి మార్చగా 14గం॥15 ని॥లు ఆనాటిసూర్యోదయమ 6-09 కి కలుపగా 20-24 అనగా రాత్రి 8-24 అలాగే హైదరాబాద్ ఘడియవిఘడియలు 35-03 వీనిని గం॥నిమిషాలలోకి మార్చగా 14-01-12 సెకన్లు నాటి హైదరాబాద్ సూర్యోదయమునకు కలుపగా రాత్రి8-23-12 సెకన్లు కనుక 8-24 చూపించటజరిగింది ఈవిధానంగానే దేశమంతటా కూడా ఆయానగరాలలకు సరిపోతుంది ఇక్కడ ఆలోచించవలసిన విషయం ఏమనగా రవి చంద్రులదూరమే తిధి అలాగే నక్షత్ర చంద్రుని స్థితి ని బట్టి తిధి నక్షత్రాలసమయం ఉంటుంది ఒక నగరానికి రవిచందుల్ర దూరం ఒకలాగ వేరొకనగరానిని ఒకలాగ అంతరిక్షంలో గ్రహాలు ఉండవు సమయవ్యత్యాసం ఆయా ప్రాంతాల అక్షాంశ రేఖాంశలను బట్టి సూర్యోదయ వ్యత్యాసము ననుసరించి ఉంటుంది అనే సంగతి గుర్తు ఉంచుకోదగినవిషయము తిధిముందుగా హైదరాబాద్ కు అయిపోతోంది అంటే అర్ధం హైదరాబాద్ కి సూర్యోదయం ఆలస్యం అని అర్ధం ఘడియ విఘడియలలో చైత్రపక్షం వారిది సరిగానే ఉండి కాకపోతే లోకల్ టైం ఎవరూ చూడరు అందరూ ఐ ఎస్ టీ నే వాడతారుకదా అందుకే ఆవిధంగాఉంటుంది అనే విషయాన్నివిజ్ఞులు గమనించిఇకనైనా విమర్శలను చేయరాదని విజ్ఞప్తి చేయు చున్నాను.

ఇట్లు భవదీయుడు

శిష్ట్లా ఉమామహేశ్వరశర్మ పంచాంగకర్త

## శ్రీకాకుళ పురవర్ణనము

సీ॥ బలబద్ర హలముచే ప్రభవించిపావన నాగావళీనదీనాట్యమాడ
కోటికోర్కెలు తీర్చు కోటీశ్వరుడు తాను కొలువుండి సేవలగొనుచునుండ
విప్రులందరుచేరి వేదమంత్రములు చక్కగాగానంబు సలుపుచుండ
దేదీప్యమానమై దేవాలయంబుల దేవసౌధంబుల తీరునమరియుండ
తే॥ సురలనగరంబు మరిపించుకరణినొప్పు ఆంద్రదేశమునందు విఖ్యాతిగాంచి
వరలుచున్నటి సుందరవరపురంబు నమరశ్రీకాకుళంబు ప్రభాకరంబు





# దైవప్రార్ధనలు



## గణపతిప్రార్ధన

సీ॥ శ్రీకరంబైనట చిన్నితొండముతోడ కరుణచూపెడి వాలుకనులతోడ
వామాంకమున లచ్చి వాసమైయుండంగ సిద్దిబుద్దులుపేర్మిచెంతనుండ
జేరిసురలు తన్నుసేవించుచుండంగ బేర్మిగందర్వులు ప్రియముపాడ
యప్సరోగణమునల్లనల్లననాడ యమరగణంబులంజలులిడంగ
తే॥ వెండికొండనువాసమైవెలయునట్టి నాగభూషణుసతికినానందమొప్ప
ముద్దులొలికెడిమోముతో మురిపమొసగు విఘ్ననాయకభక్తితో వినుతిచేతు

## సరస్వతీ స్తుతి



సీ॥ సారంగగర్భుని చక్కనినిల్లాలు సారంగపాణియైసరయుబోటి
సారంగజితతేజ సంశోభితశరీర సారంగనిభయాన చంద్రనయన
సారంగముదకుంభసహితపయోధరి సారంగపత్రవిశాలనయన
సారంగిపల్కుల చక్కటిపూబోటి సారసతనుతెల్పు సద్గుణవతి
తే॥ సారసేక్షునిసతికి కుమారురాణి సాదరముతోడ నేచేయుసాంఖ్యమందు
పొచ్చములు లేక ధీశక్తిపొడమునటుల చేయుమనుచును మ్రొక్కెదచేతులెత్తి

## గురుప్రార్ధన



చం॥ అమలినధీవిశారదులు నన్నపశాస్త్రిసుపుత్రచంద్రులున్
అమలయశోవిశాలురు యార్జితకీర్తులు నాకుగుర్వులున్
సమతగలట్టివారు తమసత్కులమందునవిష్ణుభక్తులున్
మమతనునన్నుచూచిమానసమందనురాగబంధురిన్
తే॥ విద్యలందున జ్యోతిషవిద్యమిన్న అట్టివిద్యనునాకిచ్చినట్టిఘనులు
సూర్యనారాయణాఖ్యుని శోభనలర వారిపదములునుతియింతువాంఛమీర



తే॥ సాదరంబుననను చేర నాదరించి
వేదవిద్యను గరపిన విభుధవరుడు
సత్యనారాయుణుల వారి చరణములకు
వందనశతములన్‌జేతు భక్తితోడ

## అంకితము



చ॥ అతులితమైనపూజలందుచు చెంగటహర్షవల్లిలో
నతులొనరించువారికిల నాకమొసంగుచు రోగమోక్షణం
బతిదయతో నొనర్చు కమలాప్తుని కంజలిచేసి మత్కృతిన్
అతివినయంబునప్రభున కంకితమిత్తు నభీష్టసిద్ధికిన్

**శ్రీకాకుళంలో వేంచేసి యున్న హర్షవిల్లి**
**శ్రీ సూర్యనారాయణమూర్తికి అంకితమిచ్చుచున్నాను**




# కొన్ని ముఖ్యమగు శ్లోకములు

## నవగ్రహ ప్రార్ధన

శ్లో: ఆదిత్యాయిచ సోమాయ మంగళాయ బుధాయచ
గురుశుక్ర శనిభ్యశ్చ రాహవేకేతవే నమ:

## పరుండి లేచినపిదప చేతులు చూసుకొనుచూ

శ్లో: కరనాగ్రేవసతే లక్ష్మీ కరమధ్యేసరస్వతి
కరమూలే స్థితా గౌరీ ప్రభాతే కరదర్శనం

## భూమిపైకాలుపెట్టి మంచందిగినపుడు

శ్లో: సముద్రవసనేదేవీ పర్వతస్థనమండలే
విష్ణుపత్నీ నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే

## స్నానముచేయునపుడు

శ్లో: గంగేచయమునాచైవ గోదావరి సరస్వతీ
నర్మదాసింధుకావేరి జలేస్మిన్ సన్నిదం కురు

## తులసీనమస్కారం

శ్లో: యన్మూలే సర్వతీర్ధాని యన్మధ్యే సర్వదేవతా:
యదగ్రే సర్వవేదాశ్చ తులసీం త్వాం నమామ్యహం

## అశ్వద్ధ ప్రదక్షిణం

శ్లో: మూలతోబ్రహ్మరూపాయ మధ్యతో విష్ణురూపిణే
అగ్రతోశివరూపాయ వృక్షరాజాయతేనమ:

## దీపంపెట్టునపుడు

శ్లో: ఘృతవర్తి సమాయుక్తం అంధకారవినాశనం
దీపందాస్యామి తేదేవ గృహాన ముదితాభవ

## సంధ్యాదీపం పెట్టునపుడు

శ్లో: దీపంజ్యోతిపరబ్రహ్మ అఖండజ్ఞానదాయిని
దీపంహి వరదం నీత్యం సాయందీపం నమోస్తుతే

## సూర్యనమస్కారము

శ్లో: బ్రహ్మస్వరూపముదయే మధ్యాహ్నంతు మహేశ్వరం
సాయంధ్యాయే స్సదావిష్ణుం త్రిమూర్తించ దివాకరం

## భోజనముచేయునపుడు

శ్లో: అగస్త్యకుంభకర్ణంచ శమంచ బడబానలం
ఆహారపరిమానార్ధం స్మరామిచ వృకోదరం

## ఔషధము సేవించునపుడు

శ్లో: ధన్వంతరీ గరుత్మంతం ఫణిరాజంచ కౌస్తుభం
అచ్చుతంచామృతంచంద్రంస్మరేదౌషధకర్మణి







## ఏకశ్లోక రామాయణం

శ్లో: ఆదౌకౌశలగర్భపుత్రజననం బాలోచితక్రీడనం
మౌంజీబంధన వేదశాస్త్రపఠనం మౌనీష్టిసంరక్షణం
అహల్యాశాపవిమోచనే జనకజాకల్యాణమహోత్సవం
మధ్యేభార్గవరామగర్వహరణం పట్టాభిషేకోత్సవం
పశ్చాద్రామతపోవనాదిగమణం హత్వామృగంకాంచనం
వైదేహీహరణం జటాయుమరణం సుగ్రీవసంభాషణం
వాలీనిగ్రహణం సముద్రతరణం లంకాపురీదాహనం
పశ్చాద్రావణకుంభకర్ణనిధనం హేతద్ధిరామాయణం

## ఏకశ్లోకభారతము

శ్లో: ఆదౌ పాండవధార్తరాష్ట్రజననం లాక్షాగృహేదాహనం
ద్యూతేస్త్రీహరణం వనేవిహరణం మాత్స్యాలయేవర్ధనం
లీలాగోగ్రహణం రణేవిహరణం సంధిక్రియాజృంభనం
పశ్చాద్భీష్మసుయోధనాది నిధనం హ్యేతత్ మహాభారతం

## ఏకశ్లోక భాగవతము

శ్లో: ఆదౌ దేవకిదేవగర్భజననం గోపీగృహేవర్ధనం
మాయాపూతన జీవితాపహరణం గోవర్ధనోద్ధారకం
కంసచ్ఛేధన నారకాదిహననం కౌంతేయసంరక్షణం
ఏతద్భాగవతం పురాణకధితం శ్రీకృష్ణలీలామృతం

## జ్యోతిష్కులుపఠించదగిన శ్లోకము

శ్లో: మూర్తిత్వేపరికల్పితే శశిభృతో వర్త్మాపునర్జన్మనా
మాత్మాత్యాత్మవిధాం క్రతుశ్చయజతామ్భర్తామరజ్యోతిషాం
లోకానాప్రళయోద్భవస్థితివిభుశ్చానేకధాయ:స్మృతా
వాచ:న: సదధాత్వనేకకిరణా స్త్రైలోకదీపోరవి:



## విషయ సూచిక







## శుభముహూర్తములయందున తారాబల చంద్రబలముల నిర్ణయము

శుభముహూర్తములయందున జన్మ లేక నామనక్షత్రాదిగా ముహూర్తకాల నక్షత్రము వరకూ లెక్కించి ఆసంఖ్య 9, చే భాగించిన శేషము 1, జన్మతారయూ, 2, సంపత్తారయూ, 3, విపత్తార, 4, క్షేమతార, 5, ప్రత్యక్తార, 6, సాధనతార, 7 నైధనతార, 8, మిత్రతార, 9, పరమమిత్రతార అగును. అందు 1,3,5,7, శేషముగా వచ్చిన జన్మ, విపత్, ప్రత్యక్, నైధనతారలు, శుభకార్యములయందున విడువవలెను. అందున స్త్రీలకు జన్మతార దోషములేదు: తప్పనిసరి పరిస్థితులయందున ప్రథమ నవకమున జన్మతారయూ, ద్వితీయనవకమున విపత్తార, తృతీయనవకమున ప్రత్యక్తారయూ ఎల్ల వేళలయందునా నైధనతార తప్పకవిడచిపెట్టవలెను.

<u>దోషోపవాదము</u> నిషేక గర్భాదాన అన్నప్రాశన వ్యవసాయకర్మయందున రాజ్యాభిషేక కర్మలయందున జన్మతారయూ వివాహములయందున ప్రత్యక్తారయూ దోషములేదని కొంతమంది ఋషుల అభిప్రాయము.

<u>చంద్రబలము</u> జన్మరాశిలగాయతు ముహూర్తసమయమునకు చంద్రుడున్న రాశివరకూ లెక్కించిన ఉభయపక్షములయందుననూ 1,3,6,7,10,11 రాశులయందుననూ శుక్లపక్షమునందున 2,5, 9 రాశులయందుననూ బహుళపక్షమున 4,8,12 రాశులయందున చంద్రుడున్నచో శుభకరము.

<u>పంచకరహితము</u> ముహూర్తసమయమునకు గల తిథి సంఖ్య (పక్షాదిగా) వారసంఖ్య నక్షత్రసంఖ్య లగ్న సంఖ్యలను కలపి 9 చేభాగించగా 3, 5, 7 శేషమైన పంచకరహితమైనదిగా భావించవలెను. అటులకాక 1, శేషమువచ్చిన మృత్యు పంచకము, 2 శేషమైన అగ్నిపంచకము, 4 శేషమైన రాజపంచకము, 6 శేషమైన చోరపంచకము, 8 శేషమైన రోగ లేక వసు పంచకము అని అందురు. ఇవి అన్ని శుభకార్యములయందుననూ విడువవలెను. అందునా 1, 2 శేషము వచ్చిన మృత్యు అగ్ని పంచకములు ఎల్లవేళలయందునా విడచిపెట్టవలెను.

<u>దోషాపవాదము</u> ఉద్యోగ వ్యవహార పదవీ స్వీకారములయందున రాజపంచకమునూ, గృహప్రవేశ ప్రయాణ దేవతాప్రతిష్టలయందున చోర రోగ (వసు)పంచకములనూ తప్పనిసరిగా విడచిపెట్టవలెను.

<u>మతాంతరరహితము:</u> ఎటులనగా ముహూర్తసమయమునకు గల గతతిథి ముహూర్త లగ్నసంఖ్యలను కలపి 9 చే భాగించగా శేషము పైవిధముగా చూడవలెను. ధ్రువసంఖ్యలను కలపి మతాంతరముచేయువిధానము యోగ్యమైనది కాదు. గాన వివరించుటలేదు. పంచకరహితము చేయునపుడు 1,2 శేషం వస్తే మతాంతరము కూడా చేయరాదు.

<u>కాలభేధము:</u> రాత్రియందున చోరపంచకము పగటియందున రాజపంచకము సంధ్యాకాలమున మృత్యుపంచకము ఎల్లవేళలా అగ్నిపంచకములను తప్పక విడచిపెట్టవలెను.

**సూచన:** ఏముహూర్తానికైననూ మొదట పంచకరహితముచేయునపుడు శేషము1 2 వచ్చిన మృత్యు అగ్ని పంచకములను మతాంతరము చేయరాదు అటులచేసిన అటువంటి ముహూ ర్తములు శ్రేష్టముగానుండవు వాటినివిడచిపెట్టినచో శ్రేష్టముగా నుండగలవు.

## శుభ ముహూర్తములకు యోగ్య తిథివారనక్షత్రాదులు

**జాతకర్మ నామకరణములకు:** ఉభయపక్షములయందున 3, 5, 7, 10, 11 తిధిలును శుక్లపక్షమున 1, 12, 13, తిథులునూ సోమ బుధ గురు శుక్రవారములు అశ్వ, రోహి, మృగ, పున, పుష్య, హస్త, స్వాతి, అనూ, శ్రవణ, ధని, శత ,ఉత్తరాత్రయం, నక్షత్రములునూ లేక శిశువులయొక్క జన్మనక్షత్రములయందున గాని 11, 21, 27, 29 వరోజులయందున కానీ మూడవనెలయందున కానీ వృష మిధున కర్కాటక సింహ, వృశ్చి,కుంభలగ్నములు మంచివి. పంచమస్థానము శుద్ధమై ఉండవలెను, లేదా గురుశుకృలు పంచమమున ఉన్ననూ మంచిదే కానీ పాపగ్రహవర్జితమై పంచమస్థానమున ఉండవలెను.



**డోలాహరణము:** (ఊయలలో వేయుటకు) ఉభయపక్షములయందున 3, 5, 7, 10, 11 తిధిలును శుక్లపక్షమున 1,12, 13, తిథులునూ సోమ బుధ గురు శుక్ర వారములు, అశ్వ, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర హస్త చిత్త స్వాతి,అనూరాధ మూల ఉత్తరాత్రయం, నక్షత్రములయందున శుభలగ్నముల యందు న మంచిది. సాధారణముగా నామకరణము దినమున సాయంత్రం వేయుదురు అష్టమశుద్ధి చూడవలెను.



**అన్నప్రాశన:** ఉభయపక్షములయందున 3,5,7,10, శుక్ల పక్షమున 13 బహుళ పక్షమున విదియ తిథులు సోమ బుధ గురు శుక్రవారములు అశ్వని, రోహిణి, మృగ, పున, పుష్యమి, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, అనూ, శ్రవ, ధని, శత, రేవతి, నక్షత్రములయందుననూ, వృష, మిధున, కర్కా కన్య, ధనుర్ మీనలగ్నము లయందున శుభప్రదము. లగ్నాదిగా దశమశుద్ధి తప్పనిసరి పురుషులకు 6,8,10 మాసములయందుననూ స్త్రీశిశువులకు 5,7,9,11 మాసములయందున జరిపించవలెను.



**చౌలము (చూడాకర్మ చెవులుకుట్టుట)**
శుద్ధపక్షమున 3,5,7 10, తిథులు బహుళపక్షమున 2,3,5,10 తిథులునూ సోమ బుధ గురు శుక్రవారములు అశ్వ,మృగ, పున, పుష్య, చిత్త స్వాతి, శ్రవ, ధని, శత, రేవతి నక్షత్రములయందున వృష, మిధున కర్కా సింహ, కన్య తుల మీన లగ్నములుప్రశస్తము, అష్టమశుద్ధి ముఖ్యము. 3 సంగులనుండి 5 సంగు లోపున ఈకర్మను చేయవలెను.







**కేశఖండన (పుట్టుజుత్తులు తీయుటకు)** శుక్లపక్షమున **3,5,7,10,13** తిథులునూ బహుళమున **2,3,7,10** తిథులు సోమ బుధ శని వారములు అశ్వ, మృగ,పుష్య, హస్త, చిత్త, స్వాతి, శ్రవ, ధని,రేవతి నక్షత్రములయందున వృషభ, మిధున కన్య, తుల ధను, మీన లగ్నముయందున **1, 3, 5** వసంగులయందుననూ పూర్వాహ్ణమున అనగా మద్యాహ్నాం **12**గంగులోపుగాజరిపించవలెను.



**అక్షరాభ్యాసము** శుక్లపక్షమునందున **3,5,7,10** తిథులునూ బహులమున **2,3,5,7, 10** సోమ బుధ, గురు శుక్రవారములు అనూ, రేవ, హస్త, అశ్వి, ఆరుద్ర, శ్రవ, పున, పుష్య, మృగ, ధని, శత, నక్షత్రములయందుననూ మేష, వృష, కర్కాటక, సింహ, తుల, వృశ్చి, ధను మక, కుంభలగ్నములయందుననూ ఉత్తరాయణమున అష్టమశుద్ధి గలగియున్న ముహూర్తమున శుభప్రధము.



**విద్యారంభము** శుక్లపక్షమున **2,3,5,7, 10,13** తిథులు బహులమున **2,3,5,7, 10** తిథులు ఆది బుధ గురు శుక్రవారములు అశ్వ, మృగ, ఆరు, పున, ఆశ్లే, పూర్వాత్రయం, హస్త,చిత్త స్వాతి, శ్రవ, ధని, శత, అనూ నక్షత్రములయందున, మేష, మిధున, కర్కాటక తుల ధను, మకర, మీన, లగ్నములయందున దివాభాగమున అనధ్యాయదినములు కాకుండగా అష్టమశుద్ధి గలగిన ముహూర్తములయందున శుభము. విద్యలకు కళలకు ఇదేవిధముగా చూడనగును, విశేషించి ఋగ్వేదమునకు గురువారము, యజుర్వేద సామవేదములకు శుక్రవారము, అధర్వణవేదము జ్యోతిష శాస్త్ర గణితశాస్త్రాదులకు బుధవారము, సంగీత నాట్య కళాది విద్యలకు సోమ శుక్రవారములు ప్రశస్తమైనవి.

**ఉపనయన ప్రకరణము** గర్భములో పడినదిమొదలుకొని బ్రాహ్మణులకి **8** వసంగుముననూ క్షత్రియులకు **11** వ సంగుమున వైశ్యులకు **12** వసంగు మున ఉపనయన కాలము నిర్దేశించబడినది బ్రహ్మవర్చస్సు వేధాధ్యయనము మొదలగు కర్మార్ధులకు **5**,వసంగుము చేయదగునని ఋషులు అభిప్రాయము. బ్రాహ్మణులకు **16** సంగులలోపుననూ క్షత్రియులకు **22** సంగుముల లోపుననూ వైశ్యులకు **24** సంగుములలోపున ఉపనయన సంస్కారము చేయనిచో కాలాతిక్రమణ దోషము సంభవించుచున్నది అట్టితరి ప్రాయశ్చిత్తాదులను చేసుకొని ఉపనయనము చేయవలెను.

శుక్లపక్షమున **3,5,7,10, 13,** బహుళపక్షమున **2,5,7,10** తిథులునూ, ఆది,సోమ బుధ, గురు, శుక్రవారములు, రోహిణి, మృగ, ఆరు(ఋగ్వేదులకు) పున, పుష్యమి, ఉత్తరాత్రయం, అశ్వి, శ్రవ, ధని, స్వాతి, చిత్త, రేవతి, హస్త, అనూ, నక్షత్రముల యందుననూ మేష, వృషమిధున, కర్కా, కన్య, తుల, వృశ్చి, ధను, మీనలగ్నముల యందున ప్రశస్థము.

## ఉపనయనముహూర్త నియమములు

1, అష్టమ శుద్ధి ఉండవలయును, 2, అనాధ్యాయ శ్రాద్ధదినములయందున పనికిరాదు 3, ఉత్తరాయణము మఘాదిపంచకమున మాత్రమే చేయవలెను, 4, అపరాహ్నమున పనికిరాదు, 5, మీనచైత్రము శ్రేష్టము, 6, లగ్నమున చంద్రుడు ఉండరాదు, 7,కేంద్రము లయందున పాపగ్రహములు పనికిరావు, 8, కేంద్రకోణములయందున శుభహగ్రహ ములు ఉండుట మంచిది, 9, వటుని తల్లి గర్భవతియైనచో 6 మాసములు దాటిన చో ఉపనయనమునకు పనికిరాదు, 10, ఆషాఢశుద్ధ ద్వాదశి, జేష్టశుద్ధ విదియ పుష్య శు ద్ధ ఏకాదశి , మాఘ శుద్ధ ద్వాదశి, ఇంకనూ ఏనెలయందైననూ చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య, అష్టమి, సూర్యసంక్రమణము, ఇవి అనాధ్యాయదినములు కనుక ఈదినము లలలో ఉపనయనము పనికిరాదు.



## వివాహప్రకరణము

**కుజదోషము పరిశీలన** స్త్రీపురుషుల ఇరువురి జాతకముల యందున లగ్నాదిగాగాని చంద్రుడున్నరాశినుండి గాని, శుక్రుడున్నరాశి రాశి నుండి కానీ 1,2,4,7,8,12 రాశులయందున కుజుడున్నచో కుజదోషమనబడును

ఈ కుజదోషం కాబోవు వధూవరుల ఇరువురి జాతకముల యందున సమముగా ఉ న్నచో దోషములేదు.అట్టివారిరివురికీ వివాహము చేసినచో అనుకూలదాంపత్యము అన్యోన్యత గలగి సుఖమయజీవితము గడుపగలరు

అట్లుకాక ఒకరి జాతకములో కుజదోషము ఉండి వేరొకరి జాతకమునందున కుజదోషములేకున్నచో వారిరువురికినీ వివాహము చేసినచో భర్త లేక భార్య మరణించుట దాంపత్యజీవితమునకు సుఖము లేకుండుట విడిపోవుట ఇత్యాది పాపఫలములు కలుగును. కనుక అటువంటివారికి వివాహము చేయరాదు.

### కుజదోషము భంగములు

1, కుజునితో చంద్రుడుగానీ గురుడు కానీ కలసియున్న కుజదోషము భంగమగును.

2, ఏలగ్నమునకైననూ సింహ, కర్కాటక ,మేష, వృశ్చి,మకర రాశుల యందున కుజుడున్నచో దోషములేదు (ఇది అనుభవమునకు సరిపడుట లేదు మధ్య వయసు దాటిన తదుపరి దోషములు కలుగుచున్నవి)

3, మేష వృశ్చికములు జన్మలగ్నములై అందున కుజుడున్ననూ లేక ఆ రాశులయందున చంద్రశుకృడుండి అచట కుజుడున్ననూ కుజదోషములేదు

4, వృషభ సింహములు జన్మలగ్నములై ద్వితీయమున కుజుడున్ననూ కుజదోషములేదు

**5, మకర కుంభ లగ్నములు జన్మలగ్నములై చతుర్థమున కుజుడున్నచో కుజదోషము లేదు ( సహజముగా కుజుడు చతుర్థమున అంతగా దోషకరుడు కాదు)**





**6, మకర కర్కాటకములు జన్మ లగ్నములై సప్తమస్థానమున కుజుడున్నచో కుజదోషములేదు.**

**7, వృషభ సింహ లగ్నములు జన్మలగ్నములై అష్టమమున కుజుడున్నచో కుజదోషము లేదు.**

**8, మేషవృశ్చిక లగ్నములు జన్మలగ్నములై లేదా ఆయారాశులలో చంద్ర శుకృలుండి సప్తమమున కుజుడు యున్ననూ కుజదోషముండబోదు**

**9, జన్మ లగ్నాత్ 1,4,7, 10 స్థానములయందున శనియున్నచో కుజదోష ము భంగమగును.**

**10,** కుజునితో శని రాహు కేతువులలో ఎవరైననూ కలసియున్నచో కుజుని దృష్టి వారికి కలగిననూ కుజదోషముండబోదు.

ఈవిధముగా కుజదోషమును దోషభంగములను క్షుణ్ణంగా పరిశీలించి పిదప దశవిధపొంతనములు గుణమేళన చక్రమునందలిగుణములను చూసి పిదప ఆయాజాతకములకు వివాహము చేయవచ్చునా లేదా అనునది పరిశీలించిన తరువాత సరియగునిర్ణయము చేయదగును. ఒకప్పుడు గుణమేళన చక్రమున 18 పాయింట్ల కు తక్కువ వచ్చిననూ వారి జాతకములో గ్రహముల స్థితినను సరించి తగునిర్ణయమును చేయవలెను.

### దశవిధపొంతనములు

**1. దినపొంతనము:** స్త్రీ జన్మ లేక నామనక్షత్రమునుండి పురుషుని జన్మ లేక నామ నక్షత్రమువరకూ లెక్కించినపుడు 9 కన్నా అధికమైనచో 9 చే భాగించగా శేషసంఖ్య 1,2,4,6,8, 9 సంఖ్యలుగా వచ్చిన నక్షత్రములు శుభప్రదము అనగా స్త్రీ జన్మ నక్షత్రమునుండి పురుషుని నక్షత్రము 1, 2, 4, 6, 8, 9 ,10, 11, 13, 15, 17, 19, 20, 22, 24, 26, 27 నక్షత్రములు శుభప్రదములు.

**2, గణకూటము:** పునర్వసు, పుష్య, స్వాతి, హస్త, శ్రవ, రేవతి అనూ, మృగ, అశ్వి, ఈ 9 నక్షత్రములు దేవగణ నక్షత్రములు, రోహిణి, పుబ్బ, పూ॥షాఢ పూ॥భాద్ర, భరణి, ఆరు, ఉత్తర, ఉ॥షాఢ, 9 నక్షత్రములు మనుష్యగణము మిగిలిన 9 నక్షత్రములు అనగా కృత్తి, ఆశ్లేష, మఘ, చిత్త, విశాఖ, జేష్ట మూల, ధనిష్ట, శతభిషం ఇవి రాక్షసగణ నక్షత్రములు వివాహపొంతన యందునవధూవరులిరువురివీ ఏకగణమైన శుభప్రధము, దైవమనుష్య గణములు మధ్యమము, దైవరాక్షస గణములు వైరము, రాక్షస మనుష్య గణములు మృత్యువును కలగించును.

**3, మహేంద్రపొంతనము:** స్త్రీనక్షత్రముమొదలు పురుష నక్షత్రము వరకూ లెక్కించగా 4,7,10,13,16,19,22,25 సంఖ్యలు వచ్చిన నక్షత్రములు శుభ ప్రదము తక్కినవి అశుభము.

**4, రాశిపొంతనము:** స్త్రీరాశినుండి పురుషరాశివరకూ లెక్కించగా పురుషరాశి 2 వది

ఐననూ పురుషరాశినుండి స్త్రీరాశి 12 వది ఐననూ మృత్యువు, 12-2అయిన ఆయుర్వృద్ధి,3-11 అయినచో దు:ఖము, 11-3 అయిన శుభము.4-10 అయిన నీచము, 10-4 అయిన ధనప్రాప్తి, 5-9 శుభము, 9-5 అశుభము, 6-8 పుత్రనాశము, 8-6 పుత్రలాభము, 7-7 అయినచో సర్వ సౌఖ్యము.

**5, స్త్రీధీర్ఘకూటము:** స్త్రీనక్షత్రమునుండి 13 నక్షత్రముల తరువాత పురుష నక్షత్రము అయినచో వివాహమునకు శుభము.

**6, రజ్జుకూటమి:** మృగ, చిత్త, ధనిష్ట ఇవి శిరోరజ్జు నక్షత్రములు, రోహి,
హస్త, స్వాతి, శ్రవణ, శతభిషములు కంఠరజ్జు నక్షత్రములు. కృత్తి, పున,
ఉత్త, విశా, పూ॥షాడ, పూ॥భా నక్షత్రములు నాభిరజ్జు గలవి. భర, పుష్య
పుబ్బ, అనూ, ఉ॥షా, ఉ॥బా, ఇవి ఊరురజ్జు నక్షత్రములు అశ్వ, ఆశ్లే, మఘ, జేష్ట, మూల, రేవ, ఇవిపాదరజ్జు నక్షత్రములు ఏక రజ్జు నక్షత్రముల వారికి వివాహము పనికి రాదు.

**7, నాడీ పొంతనము:** జేష్ట, మూల, ఆరుద్ర, పునర్వసు, ఉత్తర, హస్త, శత, పూ॥బాద్ర
ఇవి ఆదినాడి నక్షత్రములు, మృగశిర, చిత్త, అనూ, భర, ధని,
పూ॥షా,పుబ్బ, ఉ॥బా, మద్యనాడి నక్షత్రములు, స్వాతి, విశాఖ, కృత్తి, రోహి, ఆశ్లే, మఘ,ఉ॥షా, శ్రవ, రేవ, ఇవి అంత్యనాడీ నక్షత్రములు, వివాహమునకు, ఏక అంత్యనాడులు శుభము, మిగిలన ఆదిమధ్యనాడులుఅశుభము.

**8, వశ్యపొంతనము:** మేషరాశికి, సింహవృశ్చికములు, వృషభమునకు కర్కాటక తులలు, మిధునమునకు కన్యయూ, కర్కాటకమునకు వృశ్చిక ధనస్సులు, సింహమునకు తులయూ, కన్యకు మీనమిధునములు తులకు మకర కన్యలు, వృశ్చికమునకు కర్కాటకము, ధనస్సుకు మీనము, మకరమునకు, మేష కుంభములు, కుంభమునకు మేషము, మీనరాశికి మకరరాశియూ పరస్పర వశ్యరాశులగుచున్నవి.కనుక ఆయారాశులవారికి వివాహము శుభప్రదమగును.

**9, వర్ణపొంతనము:** కర్కాటక మీన వృశ్చికములు బ్రాహ్మణజాతి రాశులు
సింహ ధను తులలు క్షత్రియజాతివి, మేషమిధున కుంభములు వైశ్యజాతివి
వృషభ మకర కన్యలు శూద్రజాతికి చెందిన రాశులు కనుక ఏకజాతి ఉత్తమము.

**10, యోనిపొంతనము:** అశ్వని శతభిషములు గుఱ్ఱములు, స్వాతి హస్తలు ఎనుపోతులు,
ధని పూ॥భా ద్రలు సింహములు, భరణీ రేవతులు ఏనుగులు,
కృత్తిక పుష్యమిలు మేకలు, పూ॥షాఢ శ్రవణముఉలు కోతులు, ఉ॥షాడ అభిజిత్ లు
ముంగిసలు, రోహిణి మృగశిరలు పాములు, జేష్ట అనూరాధలు
లేడులు, మూల ఆరుద్రలు కుక్కలు, ఆశ్లేష పునర్వసులు పిల్లులు, మఘ పుబ్బలు ఎలుకలు, చిత్త విశాఖలు పులులు ఉత్తర ఉ॥బాద్రలు గోవులు.
విరోధ జంతు వులు: పులి ఆవులు ఏనుగు సింహములు, సర్ప ముంగిశలు.
కోతి మేకలు, గుఱ్ఱము ఎనుపోతులు, పిల్లి ఎలుకలు, లేడి కుక్కలు, పరస్పర విరోధ





జంతువులు కనుక ఆయా నక్షత్రములకు పరస్పర వివాహ మునకు పనికిరాదు. ఒకవేల చేసుకొనిననచో పరస్పర విరోధముకలుగును.

**11, గ్రహమైత్రి:** వధూవరులిరువురి రావ్యాధిపతులు మిత్రులు లేక సములై ఉండవలెను. కానీ శతృవులు కారాదు ముఖ్యముగా ఈ గ్రహమైత్రి బ్రాహ్మణు లకు అత్యంత ఆవశ్యకము.

గ్రహ మిత్ర శతృ సమత్వ నిర్ణయము

| గ్రహము | మిత్రులు | శతృవులు | సములు |
|---|---|---|---|
| రవి | బుదుధు | శుక్ర శనులు | చంద్ర కుజగురు |
| చంద్ర | రవి బుధ | లేరు | కుజ గురుశుక్రశని |
| కుజ | రవి చంద్రగురు | బుద | శుక్ర శని |
| బుధ | రవి శుకృ | చంద్ర | కుజ గురు శని |
| గురు | రవి చంద్రకుజ | బుద శుక్ర | శని |
| శుక్ర | బుద శని | రవి చంద్ర | కుజ గురు |
| శని | బుద శుక్ర | రవిచంద్రకుజ | గురుడు |

## వివాహమైన పిదప చేయదగని కార్యములు

ఉపనయన వివాహమైన పిదప 6 మాసములు లోపున తద్దినం పెట్టరాదు అని కొందరందురు కాని అట్లని తద్దినం పెట్టటం మానరాదు వేరేగృహమునందున గానీ జ్ఞాతుల గృహమునందున కాని కాశి గయ వంటి క్షేత్రములలో కానీ పెట్ట వచ్చును ఒకవేల అట్లువీలుకాని పక్షమున తన ఇంటిదగ్గరైననూ నువ్వులు లేకుండగా పితృకార్యమును తప్పక జరిపించ వలెను. వివాహదినముమొదలు 16 దినములలోపున తద్దినము పడినపుడుమాత్రము తప్పని సరిగా జ్ఞాతులు లేక ఇతరస్థలములందున పెట్టుమంచిది అందువలన వివాహ దినాది 16 దినములలోపు పితృతిథులు పడకుండా చూసుకొని వివాహ ముహూర్తమును నిర్ణయించవలెను. వివాహమైన పిదప 6 మాసముల పర్యంతము నూతన గృహారంభ ప్రవేశాదులు చేయరాదు
ఏకోదర విషయము: ఒకేతల్లి గర్భమున జన్మించిన స్త్రీపురుషులకు ఒకరికి వివాహమైన పిదప 6 మాసములలోపున వేరొకరికి వివాహము చేయరాదు
తప్పని సరి పరిస్థితులయందున సంవత్సర భేదమున అనగా ఫాల్గుణమాసము నందు ఒకరికినీ చైత్ర వైశాఖములయందున వేరొకరికినీ వివాహము చేయదగును. స్త్రీ వివాహమైన పిదప పురుషుని అనగా కుమార్తె వివాహమైన పిదప కుమారుని వివాహము 6 మాసములలోపునచేయవచ్చు.
ఇంకనూ ఒకేదినమందున వేర్వేరు లగ్నములయందున ఏకోదరులగు స్త్రీలకు వివాహము చేయవచ్చును.వివాహమైనపిదప 6 మాసములలోపున అయిననూ

ఉపనయనము చేయవచ్చు. వివాహమైన పిదప 6 మాసముల సంవత్సర భేదము ఉన్నప్పటికినీ గృహారంభప్రవేశాదులు చేయరాదు. పైవిషయములన్ని ఋషిప్రోక్త ములగు గ్రంధములయందున కలవు ఇంకనూ సంశయములు ఉన్నచో ఫోనులో మమ్ములను సంప్రదించవచ్చును.

గమనిక: పైవిషయములన్నియూ జ్ఞప్తినందుంచుకొని వధూవర గుణమేళన చక్రమున 18 కన్నా అధికముగా గుణములు వచ్చినచో వివాహము చేయవచ్చును. జాతకముల కలయిక బాగుగాయున్నచో గుణములకు ప్రాధాన్యత అవుసరములేదు. అయితే నామనక్షత్రము వాడునపుడునూ జాతకచక్రములు లేనపుడునూ గుణమేళన చక్రమునందు గల గుణములకు తప్పనిసరిప్రాధాన్యతనివ్వవలసియుండును. వివాహ ముహూర్తమునకు వివాహ చక్రశుద్ధి మాంగళ్య చక్రశుద్దులు కలగిన మంచిది అట్లని చక్రశుద్ధి లేని ముహూర్తము పనికిరాదని కాదు గ్రహానుకూలమైనచో మంచి ముహూర్త ములయందున వివాహమును చేయవచ్చును.

## <u>వివాహమునకు శుభతిధివారనక్షత్ర లగ్నములు</u>

మూల అనూరాధ మృగశిర రోహిణి హస్త రేవతి స్వాతి మఘ ఉత్తరాత్రయం ఈ 11 నక్షత్రములు మాత్రమే వివాహమునకు చెప్పబడియున్నవి ఇవి శ్రేష్ట మైనవి మరికొంతమది ఆచార్యుల అభిప్రాయము ననుసరించి అశ్వ, చిత్త ధని, శ్రవణం ఈనక్షత్రములు మధ్యమము కొంతమంది శతభిషా నక్షత్రమువివాహమునకు ఏగ్రంధముల యందుననూ తె ుపబడలేదు. కానీ దీని యందున కూడా వివాహ ముహూర్తములనిచ్చుచున్నారు. తక్కిన నక్షత్రములు వివాహమునకు పనికిరావు. తిథులు శుక్లపక్షమున 3,5,7,10,11,12, 13, బహులమున 2,3,5,7, 10 తిథులునూ సోమ బుధ గురు శుక్ర వారములు మంచివి అందునా కొంతమంది సోమవారము వివాహమునకు యోగ్యముకాదని తెలిపిననూ అధిక గ్రంధములయందున సోమ వారము ప్రశస్తమమని తెలుపుటచేత సోమవారము కూడా వివాహయోగ్యమని తెలియ నగును. వృషభ, మిధున, కర్కాటక, కన్యా తుల, ధనర్ మీన లగ్నములు ప్రశస్తములు

## వివాహ ముహూర్త నియమములు

1, లగ్నమునకు సప్తమశుద్ధి తప్పనిసరిగా ఉండవలెను శుభగ్రహములు ఉండదగునని కొందరి వాదన అయిననూ ఎట్టి పరిస్థితులలోనూ సప్తమమునశుభ పాపగ్రహ ములు ఏవియునూ ఉండరాదు.

2, శుకృ గురు బుధులు లగ్నమున కానీ సప్తమకేంద్రమునకాక తక్కిన కేంద్ర కోణములయందున ఉన్నచో చాలా మంచిది.

3, శుభలగ్నములు వివాహ లగ్నములై ఆ లగ్నములయందున లగ్నాధిపతి యున్నచో విశేష శుభప్రదము (ఉదా ధనుర్ లగ్నమై లగ్నగురుడు మిధున లగ్నమున బుధుడు ఈవిధముగా)

4, పాపగ్రహములు లగ్నాదిగా 3,6,11, రాశులయందున ఉండుట మంచిది

5, పగటిముహూర్తములయందున రవియూ రాత్రి ముహూర్తముల యందున





చంద్రుడునూ 11 వ స్థానమున (లాభస్థానమున) ఉన్నచో అనేకవిధములగు దోషములను పోగొట్టి దంపతులకు దీర్ఘాయురారోగ్య సంతాన సంపదలను గలగించును. కనుక అటువంటి ముహూర్తము వివాహమునకు చాలా ప్రశస్తము.

6, మీన చైత్రము అనగా రవి మీనమునందు ఉండగా చాంద్రమానమున వచ్చు చైత్రమాసమున వివాహము చేయరాదు.

ఈనియమములను పాటించి వివాహ ముహూర్తములను నిర్ణయించినచో దంపతులు చాలా సుఖశాంతులతోను సంతాన భాగ్య సౌఖ్యముతోను నిండునూరేల్లు కలసిమెలసి కాపురమును చేయగలరు.

త్రిజేష్ఠా విచారము:- జేష్టులగు వధూవరులకు జేష్టమాసమున వివాహము చేయరాదు. జేష్ఠానక్షత్రము జేష్టుడు జేష్టమాసజననము వీనికి కూడా వివాహము చేయరాదు, వధూవరులిరువురివీ జేష్ఠానక్షత్రము అయిన జేష్టమాసమున వివాహము పనికిరాదు. ఒకవేల అందులో ఒకరు జేష్టు లైనచో వారిరువురికి వివాహము చేయరాదు. ఏవిధముగా చూసిననూ 3 జేష్టలు కలియరాదు. (అంతకన్నా ఎక్కువ కూడా పనికిరాదు)

## నవవధూగృహప్రవేశము :


gg72016814 GoGraph.com

శుక్ల పక్షమున 2,3,5,7,10,11,13 తిధులు బహుళమున 1,2,3,5,7,10 తిధులు సోమ బుధ గురు శుక్ర వారములు రోహి, మృగ , పున, ఉత్తరాత్రయం హస్త చిత్త స్వాతి అనూ, శ్రవ, మూల, ధని, శత, రేవతీ నత్రములయందునశుభలగ్నములయందున మంచివి. ద్వాదశ శుద్ధి ఉండవలెను. వివాహమైన 16 దినములలోపున అయినచో తిధివార నక్షత్రాదులను చూడక మధు పర్కములతో నవ వధూప్రవేశమును చేయించవలెను (దుర్ముహూర్త,వర్జ్య దోషము లేకుండా చూసిన చాలు.

గమనిక: ఆషాఢమాసమునందున నవవధువు అత్తవారింట ఉండరాదు అట్లు ఉన్నచో దాంపత్యదోషము గలుగును. ముఖ్యముగా మిధునాషాఢము అనగా రవి మిధునములో ఉన్న ఆషాఢమాసమున కొత్త పెండ్లి కూతురు అత్తవారింట ఉండరాదు. మరియూ అత్త కొత్త కోడలు ఒకగడప తొక్కరాదని అత్తగారు లేని ఇండ్లయందున లేక అత్తగారు గ్రామాంతరమునందు ఉండగాను నూతన వధువును అత్తవారింటిదగ్గర ఉంచటం జరుగుతోంది కాని ఇది శాస్త్ర విరుద్ధము అని తెలియ వలెను. అట్లుచేసిన దాంపత్య దోషము కలుగగలదు.

**<u>గర్భాదానము:</u>** శుక్లపక్షమున 3,5,7,10, బహులమున 1,2,3,5,7, తిథులునూ ఆది సోమ బుధ గురు శుక్ర వారములు రోహిణి, మృగ, పున ఉత్తరాత్రయం హస్త చిత్త, స్వాతి అనూ, శ్రవ, ధని, శత, ఆరు, పూర్వాత్రయం విశాఖ, నక్షత్రములు, మీన మిధున సింహ కన్య కుంభ వృశ్చి, తులా ధనుర్ లగ్నములు మంచివి. లగ్నశుద్ధి తప్పనిసరిగా ఉండవలెను. పంచమ శుద్ధి లేదా పంచమము

క్రూరగ్రహవర్జితమై ఉండవలెను. వివాహమైన పిదప 16 దినములలోపున వర్జ్య దుర్ముహూర్తములు లేకుండగా పంచపర్వ ములు కాకుండగా గర్భాదానమును జరిపించవలెను. (పంచపర్వములు అనగా అష్టమి, ఏకాదశి చతుర్దశి పూర్ణిమ అమావాస్యలు)

**సీమంతము:** అన్ని శుభతిథులునూ ఆది బుధ గురు శుక్రవారములు మృగ పున పుష్య ఉత్త హస్త చిత్త స్వాతి అనూ మూల ఉ॥షా శ్రవ ధనిష్ట నక్షత్రములుశుభలగ్నములు మంచివి నవమ శుద్ధి ఉండవలెను. మౌఢ్యదోషము లేదు 5, 7, 9వ నెలయందున ఈ తంతును జరిపించవలెను.



**దేవతాప్రతిష్ఠ:** శుక్లపక్షమున 2,3,5,7,8, 10,11, 12,13,15 తిథులునూ, బహులమున1, 2,3,4,5,7, 10,తిథులు ఆది సోమ బుధ గురు శుక్రవారములు అశ్వ, రోహి, మృగ, పున పుష్య ఉత్తరాత్రయం హస్త చిత్త స్వాతి అనూ,శ్రవ ధని, శత, రేవ నక్షత్రములునూ వృష, వృశ్చిక సింహ మిధున కన్య ధనుర్ కుంభ మీన లగ్నములు మంచివి, శుక్లపక్షమున ఉత్రాయణమునందున దేవతాప్రతిష్టకు మంచిది అందునా సౌమ్యదేవతలకు ఉత్తరాయణము ఉగ్రదేవతలగు కాళి చండి మొగలగు వారికి దక్షిణాయనము శ్రేష్టము అందునా శ్రావణమాసము శివ లింగప్రతిష్ఠ శ్రేష్టము అటులనే పునర్వసు నక్షత్రమున శ్రీరామచంద్రుని ఆలయ విగ్రహముల ప్రతిష్ట శుభప్రదము అటులనే ఆయాదేవతల తిధినక్షత్రాదులలో ముహూర్తబలము ననుసరించి ముహూర్తమునిర్ణయించవలెను. అష్టమశుద్ధి ముఖ్యము.

**వాపీకూపతటాకాదులకు:** శుభతిథులును సోమబుధ గురుశుక్రవారములు శుభనక్షత్రములయందున మంచివి పూర్ణజలరాశులగు కర్కాటక కన్య మకర మీన లగ్నములు మంచివి. వృషభ కుంభ లగ్నములుమధ్యమము లగ్నమున చంద్రుడున్న లేదా చంద్ర దృష్టి యున్ననూ లేక చంద్రు జలరాశులలో ఉన్ననూ మంచిది.



**గృహారంభము (శంకుస్థాపన)** శుక్లపక్షమున 2,3,5,7, 10,11,13,15,తిథులు బహులమున 1,2,3,5,7 తిధులు సోమబుధ గురు శుక్రవారములు,అశ్వ,రోహి, మృగ, పున, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతి, అనూ, శ్రవ,ధని, శత, రేవ, నక్షత్రములు, చరలగ్నములు మిధున కన్య దనుర్ లగ్నములు మంచివి కుంభ మీనములు మధ్యమము. చతుర్ధ, అష్టమ శుద్ధి ఉండవలెను. కర్తరీ దినములు పనికిరావు వివాహమైన 6 మాసములలోపున పనికిరాదు, ఉదయము 12గం॥ లోపుననే చేయవలెను. రవి మీన మిధున ధనస్సుల యందుండగా







గృహారంభము చేయరాదు గృహకర్త్రిక, లేక కూర్మ చక్ర శుద్ధి అయినచో మంచిది.

**గృహప్రవేశము** శుక్లపక్షమున 2,3,5,7,10,11,13, తిథులు బహుళమున 1,2,3,5,7, తిథులునూ, సోమ బుధ గురు, శుక్రవారములు రోహిణి, మృగ, ఉత్తరాత్రయం చిత్త అనూ, ధని, శత, రేవతి నక్షత్రములు, స్థిరలగ్నములు మంచివి. అష్టమశుద్ధి తప్పనిసరిగా ఉండవలెను. వృషభ కలశ శుద్ధులలో ఏదోఒకటి చక్ర శుద్ధి కలగి ఉండవలెను. ద్వాదశ శుద్ధి ఉన్నచో మంచిదే కాని తప్పనిసరి కాదు. మాఘ ఫాల్గుణ వైశాఖ జేష్ఠ మాసములు ఉత్తమము మార్గశిర కార్తీక మాసములు మధ్యమము తక్కిన నెలలు అధమము.



**సర్వవిధవ్యాపారములకు** శుద్ధమున 2,3,5,7,10 11, 13, తిథులునూ, బహులమున 1.,2,3,5,7 తిథులును సోమ, బుధ గురు, శుక్రవారములు అశ్వ, రోహి, మృగ పుష్య, ఉత్తరా త్రయం, హస్త,చిత్త,స్వాతి, శ్రవ, ధని, రేవతి నక్షత్రములు వృష, మిధున కన్య తుల, ధను మీన మకర లగ్నములు, మంచివి లగ్నమునకు శుభగ్రహ దృష్టి మంచిది.



**నూతనవస్తువులు ఆభరణములు వస్త్రములు వాడుటకు**

శుభతిథులు బుద గురు శుక్రవారములు అశ్వ, రోహి, మృగ, పున, పుష్య, ఉత్తరాత్రయం, హస్త, చిత్త, స్వాతిఅనూ,శ్రవ, శత, రేవతి నక్షత్రములయందున శుభలగ్నములు మంచిది అమృత గడియలందున శుభఫలము కలుగును.



**సమస్త వ్యవసాయ పనులకు** ఆది మంగళ బుధ శుక్రవారములు శుద్ధమున 2,3,5,7, 10,11,13 బహులమున 1,2,3,5,7, తిథులు కర్కాటక తుల వృశ్చి ధనుర్లగ్నములు మంచివి.

## ప్రత్యేక కృతజ్ఞతలు





ఈపంచాంగరచనకు నన్ను ప్రోత్సహించిన
శ్రీ ఎక్కిరాల రామకృష్ణ గారు (రాజమండ్రి)
శ్రీ సముద్రాల శ్రీనివాసాచార్య (హైదరాబాద్)
మాసోదరుడు శిష్ట్లా నాగేశ్వరశర్మ (టాటానగర్) వారికి కృతజ్ఞతలు

**డా॥ శిష్ట్లా ఉమామహేశ్వరశర్మ సిద్దాంతి పంచాంగకర్త**

## శుభముహూర్తములకు చక్రశుద్ధులు

**1, విద్యాప్రాప్తికి చక్రశుద్ధి** బుధస్థితనక్షత్రాదిగా ముహూర్త నక్షత్రమువరకూ లెక్కించగా 1,2,3 తారలు జ్ఞానసిద్ధి 4,5,6, దేవతుల్యుడగుట, 7,8, 9 తారలు సంపత్తును, 10,11,12 పితృచింతననూ,13,14,15 విద్యాలేమిని, 16,17,18 తారలు కర్మాధికారిగనూ, 19,20,21 తారలు మంత్రశాస్త్రవేత్తగను, 22,23,24, మాటకారిగనూ,25,26,27 తారలు వైద్యాధికారిగనూ చేయును.

**2, ఉపనయన చక్రశుద్ధి:** వటునిజన్మనక్షత్రము మొదలు ఉపనయనముహూర్త నక్షత్రమువరకూ లెక్కించిన 1,2,3 4, తారలు శుభము 5, 6,7,8 ఆచారహీనము 9 మూర్ఖత్వ మును 10,11,12,13,14,15,16,17 తారలు అనారోగ్యమును,18,19 బ్రహ్మతేజస్సును,20,21,22,23,24,25,26,27 తారలు విధ్వాంసునిగా చేయును.

**3, వివాహచక్రశుద్ధి:** రవిస్థిత నక్షత్రమునుండి వివాహ ముహూర్త నక్షత్రమువరకూ లెక్కించిన,1,2,3,నక్షత్రములు అరిష్టము, 4,5,6, తారలు శుభము, 7,8,9, సంతానహీనం, 10,11,12 వైధవ్యము, 13,14,15 తారలు సౌఖ్యము, 16,17,18 మరణము, 19,20,21 వ్యభిచారము, 22,23,24 తారలు ధనధాన్యవృద్ధి, 25,26,17 తారలు శుభమును కలగించును.

**4, మాంగళ్య చక్రశుద్ధి:** శుకృడు ఉన్న నక్షత్రమునుండి వివాహ ముహూర్త నక్షత్రమువరకూ లెక్కించవలెను అటుల లెక్కించగా 4, 5, 6 13,14,15,22,23 ,24 నక్షత్రములలో ముహూర్తనక్షత్రము ఒకటి యై యున్నచో మాంగళ్య చక్రశుద్ధి అయినదిగా తెలియవలెను.

**5, గృహారంభచక్రశుద్ధి:** రవియున్న నక్షత్రమునుండి గృహారంభ లేక శంకుస్థాపన నక్షత్రమువరకూ లెక్కించగా 8,9,10,11,12,13,14,15,16,17,18,25,16,17 నక్షత్రములల్లొకటి ముహూర్త నక్షత్రమైయున్నచో గృహారంభచక్రశుద్ధి అగుచున్నది.

**6, వృషభచక్రశుద్ధి:** రవిస్థితనక్షత్రమునుండి గృహప్రవేశముహూర్త చక్రమువరకునూ అభిజిత్ తో కలపిలెక్కించగా 8,9,10,15,16,17, 18,19,20,21,22,23, 24,26, 27,28 నక్షత్రములలో ఒకటి అయినచో వృషభచక్రశుద్ధి అయినట్లుగా లెలియనగును.

**7, కలశచక్రశుద్ధి:** రవియున్న నక్షత్రమునుండి ముహూర్త నక్షత్రమువరకు లెక్కించగా 10,11,12,13,22,23,24,25,26,27 నక్షత్రములు ముహూర్త నక్షత్రమైనచో కలశ చక్రశుద్ధి అయినదిగా భావించవలెను.

**8, కుంభచక్రశుద్ధి:** రవిస్థితనక్షత్రమునుండి ముహూర్తనక్షత్రమువరలకూ లెక్కించిన 6,7,8,9,10,11,12,13,22,23,24,25,26,27 నక్షత్రములలో ఒకటి ముహూర్త నక్షత్రమైనచో కుంభచక్రశుద్ధిని గలగియుండును. ఇది పురాణగృహములలో ప్రవేశించుటకు ఉపయుక్తము.

**9,రాజకీయచక్రశుద్ధి:** రవియున్న నక్షత్రమునుండి రాజకీయప్రవేశము లేదా ప్రమాణ స్వీకార ముహూర్తము వరకు లేదా చైతన్యయాత్రకు బలయలుదేరు సమయము లేదా నామినేషన్లు వేసే ముహూర్త సమయమునకు గల నక్షత్రములను లెక్కించగా





4,5,6,13,14,15,16,17,18,22,23,24,25,26,27 నక్షత్రములైనచో రాజకీయ చక్రశుద్ధి గలగినదగును. (ఇది అన్ని రాజకీయకార్యములకునూ చూడదగును)

**10, కూర్మచక్రశుద్ధి:** శంకుస్థాపన ముహూర్తమునకు గలతిథిని 5 చేగుణించి అందు కృత్తికాది గా నక్షత్రముల సంఖ్యను చేర్చి 9 చే భాగించగా శేషము 1,4,7 అయినచో కూర్మచక్ర శుద్ధి అయినదిగా తెలియనగును మిగిలిన 2,3,5,6,8,9 సంఖ్యలు వచ్చినచో కూర్మచక్రశుద్ధికానేరదు.

**11, శకటచక్రశుద్ధి:** (నూతనవాహనములు వాడుటకు) రవియున్న నక్షత్రమునుండి వాహనదారుని జన్మ లేక నామ నక్షత్రము వరకూ లెక్కించగా 4,5,6,7,8,9 10,11, 12,13,14,15,19,20,21,22,23,24,25,26,27 నక్షత్రములైన చో వాహనము వాడుటకు మంచిది. మిగిలిన 1,2,3, 16,17,18 నక్షత్రములయినచో చక్రశుద్ధికా నేరదు.

**12, వర్తకచక్రశుద్ధి:** రాహువు ఉన్ననక్షత్రమునుండి వ్యాపారప్రారంభ సమయము నకు గల నక్షత్రమువరకూ లెక్కించగా 4,5,6,18,19,20,21,22,23,24,25,26,27 నక్షత్రములైనచో వర్తక చక్రశుద్ధి అనగా వ్యాపారారంభమునకు శుద్ధిగలది అగును.

**13, గర్భాదానచక్రశుద్ధి:** గురుడున్ననక్షత్రమునుండి గర్భాదాన నక్షత్రమువరకు లెక్కించగా 4,5,6,22,23,24,25,26,27, నక్షత్రములైనచో చక్రశుద్ధి అగును పుత్ర ప్రాప్తిగలగును.

**14, ద్వారచక్రశుద్ధి:** ( ద్వారములు ఎత్తుటకు) రవిస్థితనక్షత్రమునుండి ద్వారములు ఎత్తునక్షత్రమువరకు లెక్కించిన 1,2,3,4,15,16,17,18,19,20,24,25,26,27, నక్షత్రములైన శుభప్రదము.

**15, వస్త్రధారణ చక్రశుద్ధి:** (నూతనవస్త్రములు వాడుటకు,) రవిస్థితనక్షత్రము మొదలు నూతనవస్త్రములు వాడుదినము నక్షత్రము వరకూ లెక్కించినచో 4,5,6,13,14 15,22,23,24,25,26,27 నక్షత్రములలో ఒకటి యైనచో చక్రశుద్ధి అగును.

**16, కూపతటాకాదిచక్రశుద్ధి:** (నూతన చెరువులు బావులు బోరింగులు మొదలగు నవి త్రవ్వుటకు) రోహిణీ నక్షత్రముమొదలుగా ముహూర్తనక్షత్రమువరకునూ లెక్కించగా 1,2,3, జలప్రదము, 4,5,6, జలశూన్యము, 7,8,9 మధ్యమజలము, 10,11,12 జలములేకపోవుట, 13,14,15 అధికజలము, 16,17,18, మధురజలము, 19,20,21 ఉప్పునీరు, 22,23,24, జలసమృద్ధి, 25,26,27 మధ్యము జలము లభించును.

**17, ప్రభుచక్రశుద్ధి:** సేవకులను నియమించునపుడు ఉద్యోములలో చేరునపుడు అధికారులతో సంభంధమగు కార్యములు చూడదగినది. ఉద్యోగములో చేరువ్యక్తి యెక్క నక్షత్రము మొదలు అధికారియెక్క నక్షత్రము వరకూ లెక్కించగా 1,2,37 8,9,10,11, 20,22,23 నక్షత్రములలో ఒకటియైన చక్ర శుద్ధి అగును ఉద్యోగములో చేరువ్యక్తికీ యజమానికి మధ్యవిభేధములు లేకయుండును.

**18, చతుష్పాద జంతు చక్రశుద్ధి:** పెంపుడుజంతువులను గానీ వ్యవసాయదారు

లు పశువులను కొని ఇంటికితెచ్చునపుడు గానీ ఈ చక్రమును చూడదగును. ఉత్తర ఫల్గుణీ నక్షత్రముమొదలుకొని పశువులను ఇంటికి తెచ్చు నక్షత్రమువరకునూ లెక్కించిన 1,2,3,6,7,8 9,10,11,12,13,14,15,16,17,18,19,20,21,22,23,24,25 26 27 నక్షత్రములైన చో శుభదాయకము.

**19, హలచక్రశుద్ధి:** సమస్తమగు వ్యవసాయపనులను అరంభించుటకు రవియున్న నక్షత్రముమొదలు వ్యవసాయ పనులను ఆరంభించు నక్షత్రము వరకూ లెక్కించినచో 4,5,6,10,11,12,13,14,15,18,19,20,21,22,26,27 నక్షత్రములలో ఒకటియైనచో హలచక్రశుద్ధి అగును.

**20, ఔషధ చక్రశుద్ధి:** లతాది ఓషధులు తెచ్చుటకును ఔషధులు వాడుటకును సూర్యనక్షత్రమునుండి ఔషధము తీయు లేక వాడే నక్షత్రమువరకునూ లెక్కించగా 1,2,3,4,11,12,13,14,15,16,17,18,19,20 నక్షత్రములలో ఒకటియైనచో చక్రశుద్ధి అయినటులుగా తెలియవలెను తక్కిన నక్షత్రములైన చక్రశుద్ధికానేరదు పాపఫలములు గలుగును

**21, గ్రామార్వణ చక్రశుద్ధి:** గ్రామము లేక పట్టణముయెక్క జన్మ లేక నామ నక్షత్రములగాయతు తన యెక్క జన్మ లేక నామనక్షత్రము వరకూ అబిజిత్ నక్షత్రముతో పాటు లెక్కించగా 1,2,3,4 నక్షత్రములైనచో అర్ధలాభము, 9,10,11,12,13 6,7,8 నక్షత్రములు వనవాసము 9,10,11,12,13 నక్షత్రములు ధనధాన్యలాభము 14,15,16,17,18,19 నక్షత్రము లైనచోదారిద్ర్యము, 20 వనక్షత్రము పాణభయము, 21,22,23,24, నక్షత్రములు సంపథప్రాప్తి, 25,26, నక్షత్రములు భయము, 27, వ నక్షత్రము లాభదాయకము 28 వ నక్షత్రము దరిద్రము కలుగును.







## జనన కాల శాంతి నక్షత్రములు

| నక్షత్రములు | 1వ పాదం | 2వ పాదం | 3వ పాదం | 4వ పాదం |
|---|---|---|---|---|
| అశ్విని | శిశు గండం | శుభం | శుభం | శుభం |
| భరణి | శుభం | శుభం | పితృమాతృగండం | శుభం |
| కృత్తిక | శుభం | శుభం | పితృమాతృగండం | శుభం |
| రోహిణి | మేనమామగండం | మేనమామగండం | మేనమామగండం | మేనమామగండం |
| ఆశ్లేష | శుభం | ధనహాని | మాతృగండం | పితృగండం |
| మఖ | శిశు గండం | శుభం | శుభం | శుభం |
| ఉత్తర | పితృమాతృగండం | శుభం | శుభం | శుభం |
| హస్త | శుభం | శుభం | పితృమాతృగండం | శుభం |
| చిత్త | పితృమాతృగండం | పితృమాతృగండం | శుభం | శుభం |
| విశాఖ | దోషము | దోషము | దోషము | దోషము |
| జ్యేష్ఠ | సౌఖ్యహాని | ధనహాని | పితృగండం | మాతృగండం |
| మూల | దోషము | దోషము | దోషము | శుభం |
| పూర్వాషాఢ | శుభం | శిశు గండం | పితృమాతృగండం | శుభం |
| రేవతి | శుభం | శుభం | శుభం | శిశు గండం |

పై పట్టికలో తెలిపిన నక్షత్రములే కాక, శిశుజననము : తల్లిదండ్రుల జన్మ నక్షత్రములలోను, సోదరసోదరీల జన్మనక్షత్రములలోను జననమైతే శాస్త్రోక్తముగా సంపూర్ణశాంతి చేసుకొనవలయును. ఏకనక్షత్ర జననశాంతి లింగభేదమున్నచో దోషములేదు.

## బాలారిష్ట దోషములు

జననకాల లగ్నమునందు (1లో) శని, 3లో గురుడు; 4లో బుధుడు, 5లో రవి, 6లో శుక్రుడు, 7లో కుజుడు, 8లో చంద్రుడు, 9వ స్థానములో రాహువు ఉన్న పక్షమున బాలారిష్టదోషములు సంభవించును. శిశువుజన్మించిన లగ్నమునకు 1,5,6,7 ,8,12 రాశుల యందు పాపగ్రహము లుండినను లేక పాపగ్రహములచే జూడబడినను, మరియు క్షీణచంద్రుడు 12వ రాశియందుండినను బాలారిష్ట దోషములు సంభవించును.

జన్మకాలమున అష్టమాధిపతి దశ వచ్చిన బాలారిష్టము, లగ్నమందు శనియు, సప్తమమందు రవియు, అష్టమమందు కుజుడును ఉండి చంద్రుడు పాపగ్రహములచే చూడబడిన బాలారిష్టము. కుజుడు లగ్నమందును, శని షష్టమమందుగాని, అష్టమమందుగాని ఉన్న యెడల

బాలారిష్టము. చంద్రుడు-శని, రాహువులతో కలసి లగ్నమందుండి, అంగారకుడష్ట మందున్న యెడల బాలారిష్టములు కలుగును.

## బాలరిష్ట దోషభంగములు

శిశు జన్మలగ్నమునకు పై రాశులయందు ఆయా గ్రహములుండినను, ఆయా రాశులను బలమగు శుభగ్రహములు చూచినను, కేంద్రములందు ఒక శుభగ్రహ ముండినను దోషములేదు.

లగ్నాధిపతి బలవంతుడై శుభగ్రహ వీక్షణము కలిగియున్నచో బాలా రిష్టము వుండదు.

పూర్ణ చంద్రుడు శుభాంశమందుండి శుక్రునిచే చూడబడినయెడల బాలారిష్టము కలుగదు.

గురు, శుక్రులు కేంద్రములయందున్నచో బాలారిష్టము ఏర్పడదు.

శుక్లపక్షమున రాత్రియందైనను, కృష్ణపక్షమున పగటి యందైనను జన్మించిన బాలారిష్టమువుండదు.

## జననకాల ప్రకరణము

### 1. నామనక్షత్ర పరిజ్ఞానము

1. జాతకులు ఏ నక్షత్ర, ఏ పాదము అనునది తాను పుట్టినరోజును బట్టి, పంచాంగము ద్వారా తెలుసుకుని, క్రింది చూపిన పట్టికద్వారా ఆయా నక్షత్ర పాదములకు తెలిపిన అక్షరముతో నామకరణము చేసుకొనుట ఉత్తమము.

2. తమ జన్మనక్షత్రంపై అవగాహన కలిగివుండి, తమ నామం కుటుంబములో పెద్దవారి పేర్లు లేక యింటి ఇలవేల్పుల పేర్లు కూడా పెట్టుకొనుట తప్పుకాదు.

3. కుటుంబమునందు ఈ పరిజ్ఞానం లేక తమకు తోచిన పేరు పెట్టుకొని వారు వారి పేరుకి ముందరి అక్షరముతో దిగువన యిచ్చిన పట్టికలో గల అక్షరముల సముదాయములో చూసుకుని నక్షత్రమును కనుగొని ఆ నక్షత్రమును తమ జన్మనక్షత్రముగా పాటించుట మంచిది. ఇలా నామకరణం చేసుకున్నవారు తమ పేరుకి ముందు ద్విత్వాక్షరములు లేక ఒత్తు కలిగివున్న అక్షరములు వచ్చినచో, వాటికి నక్షత్రములు వేరుగా వచ్చును. ఉదాహరణకు ఈ క్రింది పేర్లను గమనింపుడు.

కృష్ణ-మృగశిర 3; హృష్ణ, ద్రోణ-స్వాతి1; శ్రీధర-చిత్ర4; క్షేత్రపాల-హస్త2; జ్ఞాన-ఆర్ద్ర3; భీమ-మూల3; భైరవ-పూ.షా3; బ్రహ్మ, ప్రభాకర ప్రహ్లాద-చిత్ర 3/4; ప్రాణ-ఉత్తర 3 ద్రౌపది-స్వాతి నక్షత్రము అగును. 'శ' వర్ణమునకు 'స' వర్ణమును చూడవలెను.





| | | | |
|---|---|---|---|
| చూ చే చో ల | అశ్విని | రూ రే రో త | స్వాతి |
| లీ లూ లే లో | భరణి | తి తూ తే తో | విశాఖ |
| ఆ ఈ ఊ ఏ | కృత్తిక | నా నీ ను నే | అనూ |
| ఓ వా వీ వో | రోహి | నో యా యి యూ | జ్యేష్ఠ |
| వే వో కా కి | మృగ | యే యో బా బీ | మూల |
| కూ కం జ ఛ | ఆర్ద్ర | బూ ధా భా ఢా | పూ.షా |
| కే కో హా హీ | పునర్వ | బే బో జా జీ | ఉ.షా |
| హూ హే హో డా | పుష్య | జూ జే జో ఖా | అభి |
| డి డూ డే డో | ఆశ్రే | ఖీ ఖూ ఖే ఖో | శ్రవణ |
| మా మీ మూ మే | మఖ | గా గీ గూ గే | ధనిష్ట |
| మో టా టీ టూ | పుబ్బ | గో సా సీ సూ | శతభిష |
| టే టో పా పీ | ఉత్తర | సే సో దా దీ | పూ.భా |
| పూ షం ణ ఠా | హస్త | దు శ్యం ఝా థా | ఉ.భా |
| పే పో రా రీ | చిత్త | దే దో చా చీ | రేవతి |

| తారలకు అధిపతులు- వాహనము - దానము | | | | ప్రారంభము నుండి విడిచే సమయం | తారల స్వభావము |
|---|---|---|---|---|---|
| తారలు | అధిపతి | వాహనము | దానము | | |
| 1) జన్మతార | సూర్యుడు | నెమలి | తోటకూర | గం 2.48 ని॥లు | దేహనాశనం |
| 2) సంపత్తార | బుధుడు | గుర్రము | - | - | ధనము |
| 3) విపత్తార | రాహువు | మేక | బెల్లం | గం 1.12 ని॥లు | కార్యహాని |
| 4) క్షేమతార | గురుడు | ఏనుగు | - | - | శుభము |
| 5) ప్రత్యక్తార | కేతువు | కాకి | ఉప్పు | గం 3.12 ని॥లు | కార్యనష్టం |
| 6) సాధనతార | చంద్రుడు | నక్క | - | - | కార్యజయం |
| 7) నైధనతార | శని | సింహము | బంగారము నువ్వులు | గం3.12 ని॥లు | పనినిలుపుదల |
| 8) మిత్రతార | శుక్రుడు | గ్రద్ధ | - | - | శుభము |
| 9) పరమమిత్రతార | కుజుడు | హంస | - | - | మందము |

చెడుతారలు వచ్చినప్పుడు పట్టికలో చూపిన విధముగా ప్రారంభం నుండి ఆయా సమయములు విడిచి మిగిలిన సమయములు ఉపయోగించుకోవచ్చును, ఎట్టి దోషములు ఉండవు.

**జాతకములకు, ప్రశ్న, ముహూర్త విషయాలకు పంచాంగకర్తలను మాత్రమే సంప్రదించగలరు.**

## దినాధిపతులు - తారాబలం - చంద్రబల గణనచక్రం

దినాధిపతులను - అంకెలలోని తారాబలమును తెలుసుకొను చక్రము - దిన నక్షత్రముల మారగానే ఆదినాధిపతి మారును.

| పంచాంగములో నక్షత్రము → / ↓ జన్మలేక నామనక్షత్రము ↓ | | | అశ్వని మఖ మూల | భరణి పుబ్బ పూ.షాడ | కృత్తిక ఉత్తర ఉ.షాడ | రోహిణి హస్త శ్రవణం | మృగశిర చిత్త ధనిష్ట | ఆరుద్ర స్వాతి శతభిషం | పునర్వసు విశాఖ పూ.భాద్ర | పుష్యమి అనూరాధ ఉ.భాద్ర | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వని | మఖ | మూల | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 |
| భరణి | పుబ్బ | పూ.షాడ | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 |
| కృత్తిక | ఉత్తర | ఉ.షాడ | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 |
| రోహిణి | హస్త | శ్రవణం | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 |
| మృగశిర | చిత్త | ధనిష్ట | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 |
| ఆరుద్ర | స్వాతి | శతభిషం | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 | గురు 4 |
| పునర్వసు | విశాఖ | పూ.భాద్ర | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 | రాహు 3 |
| పుష్యమి | అనూరాధ | ఉ.భాద్ర | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 | బుధ 2 |
| ఆశ్లేష | జ్యేష్ఠ | రేవతి | బుధ 2 | రాహు 3 | గురు 4 | కేతు 5 | చంద్ర 6 | శని 7 | శుక్ర 8 | కుజ 9 | రవి 1 |

తారాబలము : 1) జన్మతార, 2) సంపత్తార, 3) విపత్తార, 4) క్షేమ తార, 5) ప్రత్యక్తార, 6) సాధనతార, 7) నైధవతార, 8) మిత్రతార, 9) పరమమిత్రతార, ఈ తొమ్మిదింటిలో 1-3-5-7 మంచివికావు, 2-4-6-8-9 తారలు మంచివి.

చంద్రబలము : శుక్లపక్షములో - మీ జన్మరాశికి 2-5-9 స్థానాలలోను కృష్ణపక్షములో 4-8-12 స్థానాలలోనూ, ఉభయ పక్షములందు 1-3-6-7-10-11 రాశులయందు ఉన్న చంద్రుడు - చంద్రబలమునకు మంచిది.

జన్మ నక్షత్రంలో చేయదగిన పనులు : చెవులు, కుట్టుట, అన్నప్రాశన, అక్షరాభ్యాసం, ఉపనయనం, నిషేకం, యుగం, పట్టాభిషేకం, వ్యవసాయం, భూసంపాదన చేయవచ్చును. జన్మ నక్షత్రంలో చేయరాని పనులు : ప్రయాణం, పెండ్లి, క్షౌరము ఔషధసేవనం, గర్భాదానం, సీమంతం, పుంసవనములు జన్మ నక్షత్రంలో జరుపరాదు.





## ప్రతీరోజూ ఉదయాది గ్రహములు పరిపాలించు కాల (హోర) చక్రము

| వారం | కాలం | 6-7 | 7-8 | 8-9 | 9-10 | 10-11 | 11-12 | 12-1 | 1-2 | 2-3 | 3-4 | 4-5 | 5-6 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | పగలు | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని |
| | రాత్రి | గురు | బుధ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ |
| సోమ | పగలు | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి |
| | రాత్రి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| మంగ | పగలు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర |
| | రాత్రి | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర |
| బుధ | పగలు | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |
| | రాత్రి | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని |
| గురు | పగలు | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ |
| | రాత్రి | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి |
| శుక్ర | పగలు | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| | రాత్రి | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర |
| శని | పగలు | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర |
| | రాత్రి | బుధ | చంద్ర | శని | గురు | కుజ | రవి | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |

ప్రతి దినము సూర్యోదయ, సూర్యాస్తమయ కాలములుబట్టి ఒక గంట కాలము కలుపుకొని ఫలములు చూచేది

